శ్రీరస్తు.

# జానకీపతిశతకము.

వ్యాకరణ శిరోమణి

శ్రీమాఁ శృంగారం అయ్యమాచార్య

విరచితము

---

మొదటి కూర్పు 1000 ప్రతులు.

మచిలీపట్టణము,

పావనీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1924.

# పీఠిక.

—:0:—

శ్రీమహాలక్ష్మీకృపాకటాక్షసంపన్నులు పుణ్యకార్యాసక్త చిత్తులు దైవభక్తిపరాయణులునగు మహారాజశ్రీ దబ్బు వేంకట సుబ్బారావుగారు, శ్రీ రుధిరోద్గారినామ సం॥ ఫాల్గున బ॥ ౧ స్థిర వారపురాత్రి గం 2-32 ని॥ లకు చిత్తానక్షత్రయుక్త మకరలగ్నము నందు నా ప్రథమ పుత్రిక యగు చి॥ సౌ॥ వెంకట సత్యమహాలక్ష్మమ్మకు మ॥ రా॥ శ్రీ తటవర్తి రామబ్రహ్మము గారి కుమారుడు చి॥ నాగపోతురావునకును, ఈ బ॥ ౨ భానువారపు రాత్రి గం॥ 2-30 ని॥లకు స్వాతీనక్షత్రయుక్త మకరలగ్నము నందు ద్వితీయ పుత్రికయగు చి॥ సౌ॥ పర్వతవర్ధనమ్మకు మ॥ రా॥ శ్రీ॥ గోరడ్ల వెంకన్న గారి జ్యేష్ఠపుత్రుడు చి॥ రామారావునకును పాణిగ్రహణమహోత్సవములు జరుపుసమయమున, నేతజ్జానకీపతీశతకము నచ్చొత్తించుటకు బూర్ణధనసాహాయ్య మొసర్చి తమకున్న దేవబ్రాహ్మణవరప్రసాద స్వీకరణాసక్తిని వెలిబుచ్చిరి. అట్టిదాతృత్వము, ఔదార్యము, విద్యాభిమానము, సుగుణసంపత్తి యుఁగల వీరిని శ్రీరామచంద్రమూర్తి పూర్ణాయురారోగ్యైశ్వర్యయశస్సుఖంబు లొసంగుచు బుత్రపౌత్రాభివృద్ధిగా నిరంతరము రక్షించుగావుత.

ఇట్లు,

శృంగారం అయ్యమాచార్యులు.

వ్యాకరణ శిరోమణి.



శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీజానకీపతీశతకము.



శ్రీ ...వసు దేవముని సేవితపాదసరోజయుగ్మ సం
...యోగి...గ ♦ సద్గతిఁ గానక యుంటినయ్య యే
...గ...ంచెదవో ♦ దీనదయాపరమూర్తి భక్త మం
దార దయాసముద్ర హరి ♦ దాసజనావన జానకీపతీ॥

ఉ॥ నీకరుణాకటాక్షమున ♦ నేఁటికి నిన్ను స్మరించు భాగ్యముఁ
నాకనుభించెనయ్య నిను ♦ సమ్మతి నీదయఁ గోరుచుంటి నీ
రాకను జూచుచుంటి నను ♦ రాగముతో ననుఁ బ్రోవుమంటి న
య్యా కరుణించి నాహృదయ ♦ మందు వసింపుము జానకీపతీ ॥ 2

ఉ॥ ఏగతినైన నిన్ను భజి ♦ యింపఁగఁ బూనితి నేని యప్పుడే
రోగము ఘోరమోదములో ♦ రోషసుఖంబులో ముట్టడించుచున్
బాగుగ నుండనియ్యక స్వ ♦ భావము నంతయుఁ బాడుసేయు న
న్నేగతిఁ జూచి కాచెదవొ ♦ యిట్టిది నాస్థితి జానకీపతీ ॥ 3

ఉ॥ క్షీరము నీరమున్ గలియ ♦ క్షీరము(గైకొని రాజహంస యా
నీరము(ద్రోసివేయుకర ♦ ణిన్ సుగుణంబులనే గ్రహించి నా
నేరములన్ ద్యజించి కరు ♦ ణింపు ముదారత(జూపు మాపను
ద్ధారక రామ భవ్యగుణ ♦ ధామ రఘూత్తమ జానకీపతీ ॥ 4

ఉ॥ జన్మములందు మానవుని ♦ జన్మమె లెస్స యదెట్టులన్న నా
జన్మమునందు జ్ఞానమును ♦ జక్క(గ నార్జనసేయవచ్చు యు
ష్మన్మహనీయశక్తిని వి ♦ చారణ(జేసి తరింపవచ్చు నో
చిన్మయరూప రామ మృదు ♦ శీలమనోహర జానకీపతీ॥ 5

ఉ॥ భక్తులుగామరామయని ♦ పాడుచు నృత్యము(జేయుచుండ న
వ్యక్తసుఖంబు నాహృదయ ♦ మందుదయించెను నిన్ను(జూడ నా
సక్తియు(గల్గెనీభజన ♦ సల్పు(గ వేడుకపుట్టె రామ స
ద్భక్తినివేశనాహృదయ ♦ పద్మమునందిడు జానకీపతీ ॥ 6

ఉ॥ ఎన్నిపురాణముల్ వినిన ♦ నెన్నియొనర్చిన దైవభక్తి లే
కున్నను నెట్టివారలకు ♦ నుత్తమసిద్ధిలభింపనేర్చునే?
నిన్ను(గనమ్మినాడ(గడు ♦ నిర్మలచిత్తుని నన్నొనర్చి నీ
సన్నుతభక్తిమార్గమును ♦ జక్క(గ(జూపుము జానకీపతీ॥ 7

ఉ॥ భక్తులనోటరామయను ♦ పల్కులయందమృతంబులొల్కు నీ
భక్తికి(జాలదెద్దియు న ♦ పారకృపాబ్ధివి నీవు భక్తితో
శక్తికొలంది నీభజన ♦ సల్పిన భక్తవశుండ వౌదువో
ముక్తివిధానకారణ ము ♦ ముక్షుజనాశ్రయ జానకీపతీ ॥ 8

ఉ॥ నిన్నొకసారి రామయని ♦ నిర్మలచిత్తముతో వచించినన్
మున్నొనరించినట్టి యఘ ♦ ముల్ నశియించును శ్రీహరీ నిన్
సన్నుతి(జేయుచుంటిని బ్ర ♦ సన్నుడవై కృప(జూడుమయ్య ని
న్నెన్న(గ నెంతవాడను గ్ర ♦ హింపుము నామొఱ జానకీపతీ॥ 9

ఉ॥ తియ్యనితేనెలొల్కు భవ ♦ దీయకథామృతసాగరోత్సలం
దుయ్యెలలూఁగనిష్టతుల ♦ నూఁగుచునూఁగుచు నేగనేగ నే
నయ్యమృతంబుఁ ద్రావెద మ♦ హాఘములెల్ల నశించునయ్య రా
మయ్యకటాక్షముంచుమచి ♦ రాయువొసంగుచు జానకీపతీ॥ 10

ఉ॥ రామకథామృతంబు మధు ♦ రంబది గ్రోలెదు వారిపైన శ్రీ
రామకృపాకటాక్షము ని ♦ రంతరమున్ బ్రసరించు నందుచే
క్షేమముగల్గునంచును వ ♦ చింతురు భక్తులు రాఘవా భవ
న్నామసుధారసంబు రస ♦ నంబునఁ జిల్కుము జానకీపతీ॥ 11

ఉ॥ చక్కెరకంటె ద్రాక్షఫల ♦ సారముకంటెను దేనెకంటెఁ బే
రెక్కిన స్వాదుభక్ష్య మధు ♦ రేక్షురసంబులకంటె శ్రేష్ఠ మా
చక్కని రామనామరుచి ♦ షడ్రుచులందును లేదు రామ నా
వాక్కున రామనామమును ♦ వర్ధిలఁ జేయుము జానకీపతీ ॥ 12

ఉ॥ భక్తులు రామకృష్ణయని ♦ పాడుచునుండ నదేమిచోద్యమో
రక్తిగనుండు శ్రోతకను ♦ రాగము పాఠకులందుఁ గల్గుఁ ద
ద్భక్తిరసంబు తేటపడు ♦ భక్తులవాక్కున రామనామమే
మౌక్తికభూషణం బఖిల ♦ మంగళహేతువు జానకీపతీ ॥ 13

ఉ॥ నీవరనామకీర్తనము ♦ నిన్నుఁ బ్రసన్నునిఁ జేయునయ్య నీ
సేవయు వాంఛితార్థఫల ♦ సిద్ధినొసంగు భవత్పవిత్రయుః
ధీవిభవంబొసంగు భవ ♦ దీయపవిత్రపదార్చనంబు శ్రీ
భూవనితాదిభోగపరి ♦ పూర్ణసుఖంబిడు జానకీపతీ॥ 14

ఉ॥ నిత్యము నీపదార్చనము ♦ నీపదసేవయు నీదుదాస్యముః
సత్యము పుణ్యకార్యరతి ♦ సజ్జనవృత్తియు దైవభక్తిసాం
గత్యము తుచ్ఛభోగవిము ♦ ఖత్వము శాంతము ధర్మశాస్త్రపాం
డిత్యము మాత్రమిచ్చి కరు ♦ ణింపు దయాకర జానకీపతీ॥ 15

ఉ॥ శ్రీహరినామకీర్తనముఁ ♦ జేయనశించును సర్వపాపముల్
మోహలతాదిబంధము స ♦ మూలముగాఁ దెగిపోవు నందుచే
దేహమునిర్గమింపఁ గడ ♦ తేరుపథంబు తనంత చేకుఱుఁ
గా హితవైఖరుల్ పడయఁ ♦ గాఁ గరుణింపుము జానకీపతీ॥ 16

ఉ॥ ఈదినమందుఁజేయుఁ నదె ♦ యెల్లియుఁగ్రేపుఁ జేయుచుండి మో
హాదులఁజిక్కి కాలమును ♦ వ్యర్థముగానొనరించి యెట్లొ నీ
పాదములాశ్రయించి భవ ♦ బాధమువీడఁగ వేఁడుచుంటి నో
హో దయఁజూపరాదె? పురు ♦ హూతవచోనుత జానకీపతీ॥ 17

ఉ॥ కాళ్లను ఘల్లుఘల్లనుచు ♦ గజ్జెలు మ్రోగుచు నుండఁ జంబుఱఁ
వ్రేళ్లనమీటి తాళముల ♦ వేయుచు నృత్యముఁజేయుచుఁ వడిఁ
మోళ్లుచిగుర్ప గ్రావచయ ♦ ముల్ గఱఁగంగనునోరునొవ్వఁగా
నాళ్లలయంగఁబాడుచుఁ గ ♦ నందగునిన్నొగి జానకీపతీ॥ 18

ఉ॥ నన్నొకసారిబ్రోవుమని ♦ నమ్మి భజించెదు నాదుభక్తులఁ
మన్ననఁజేసిబ్రోతు నభి ♦ మానముతోనని చెప్పి తిప్పు ని
న్నిన్నివిధంబులందఱచి ♦ యెన్నుచునుంటిఁ బరాకదేల ? నా
విన్నపమాలకించుచుఁ బ ♦ విత్రునిఁ జేయుము జానకీపతీ॥ 19

ఉ॥ ఎప్పుడునీపదాబ్జముల ♦ నెంచి భజింపఁగఁబూనుకొంటినో
యప్పుడె నాదు పాపచయ ♦ మంతయు వీడెఁగదయ్య యింక నీ
గొప్పతనంబుఁజూపి నినుఁ ♦ గొల్చెడు భక్తునినన్నుఁ బ్రోవఁగాఁ
దప్పదు భక్తరక్షణమె ♦ ధర్మమునీకగు జానకీపతీ॥ 20

ఉ॥ నాలుకనిన్ వచింప శ్రవ ♦ ణంబులు నీకథలాలకింప నా
కాలముభక్తితోఁజనఁగఁ ♦ గన్నులు నిన్నుఁగనంగఁ గాళ్లు దే
వాలయముల్ చొరంగ, సక ♦ లాంగములు న్నినుగొల్చుచుండ నా
శీలముఁబాగుచేసి కృప ♦ సేయుము వేఁడితి జానకీపతీ॥ 21

ఉ॥ నీయభిషేకతీర్థమును నిర్మలమౌ తులసీప్రసాదముం
బాయనిదైవభక్తియు శుభప్రదమౌ పదపద్మసేవయుం
శ్రేయమొసంగుదాస్యమును శ్రీకరమాధవ నీదు నామముం
నాయఘముల్ నశింపఁగను నాకు సతతంబిడు జానకీపతీ॥ 22

చ॥ చెప్పఁగవచ్చు ధర్మములు చేయుట సాగదటేమికర్మమో!
తప్పనితోఁచినన్ మఱల జాలిన చేయఁగ బుద్ధిపుట్టు నీ
వెప్పమునాదు దోషముల నెంచకుమీ సముద్రోవనీకిఁకన్
దప్పమ నీపదాశ్రితుల తప్పులఁ బాపవె జానకీపతీ?॥ 23

ఉ॥ ఏనిముసంబులోన నెవఁ డెట్లు చరించును నెవ్వఁ డేయునో
వానిని చిత్రగుప్తుఁడోగి వ్రాయు నుమంతుఁ దుదిన్ యముండు నా
నానతినీయఁ గాలభటు లాతనికిం దగు శాస్తిఁ జేయు నా
రేనుసహింపఁజాలనవి యెట్టులఁ ద్రోతువొ జానకీపతీ!॥ 24

ఉ॥ చేసినదానిఁబట్టి విని సృష్టిని మోమున మూఁనుపాత్తులన్
వ్రాసినవ్రాలు దిద్దఁగల వాఁడు జగంబుల లేడు రామ నీ
దాసకలంబు మార్చుటకు దక్షుఁడవయ్య మహాప్రభావ నే
దోసిలియొగ్గి వేఁడికొన దుర్దశఁ బాపవొ జానకీపతీ?॥ 25

ఉ॥ ఆయువునూఱువత్సరము లందుసగంబును నిద్రమింగు లేఁ
బ్రాయములోనఁ గొంత స్థవిరత్వములో నొకకొంత వ్యర్థమై
పోయెడు సస్యకాలమునఁ బొట్టకునై కడునీచవృత్తులన్
జేయవలెంగదా! నినుభజించుటయెన్నఁడొ జానకీపతీ!॥ 26

ఉ॥ మంచికిబుద్ధిపోదు చెడుమార్గములన్ జొరునింద్రియావళిన్
వంచి జయింపశక్తిఁగల వాఁడనుగాను సుమీ త్వదంఘ్రులం
దంచితభక్తి నాకొసఁగు మర్త్యభవాబ్ధిఁ దరించి మోక్షముం
గాంచెద నింతయేని యుపకారముసేయుము జానకీపతీ?॥ 27

ఉ॥ కాలముపోయెడిన్ బ్రతుకు ♦ కాలముతగ్గెడుఁ గాననెవ్వతే
వేళనొ పండుటాకువలె ♦ వింతగ దేహము రాలు నక్కటా!
జాలము సేయకుండ మఱి ♦ సన్నుతపూత భవదీయనామమున్
జాలఁగ నాదు వాక్కునఁ బ్ర ♦ సన్నముసేయుము జానకీపతీ॥ 28

ఉ॥ కోరినయట్లు పండితుల ♦ కున్ ధనమిచ్చి సమస్తధర్మముల్
నేరిచి కర్మముల్ జరుప ♦ నిర్గుణుఁడన్ సుమి నాదుపూర్వ సం
స్కారము చిత్తవృత్తులును ♦ సర్వవిదుండవు నీకెఱుంగవే ?
తారకనామరామ నను ♦ ధన్యునిఁజేయుము జానకీపతీ॥ 29

ఉ॥ బూటకమైన వేషములఁ ♦ బొందుగఁ బైకిధరించి డబ్బుకై
వాటముగాఁ బురాణముల ♦ వైఖరిదెల్పెదమంచుఁ గొందఱే
మాటలఁ జెప్పుచుందు రవి ♦ మాకు రుచింపవు దేవదేవ ము
మ్మాటికి రామనామమె స ♦ మస్తము మాకగు జానకీపతీ॥ 30

ఉ॥ వేకువలేచి కృత్యముల ♦ వేగమతీర్చి సహస్రకతులన్
బాలునికైవడిన్ దిరిగి ♦ భార్యనుబిడ్డల నమ్మి వారికై
చాలినయంత లోకము వి ♦ శంకటవృత్తి గడింపనెంచినే
దూలితి నీదునామమును ♦ దూఱుఫలంబిది జానకీపతీ॥ 31

ఉ॥ ఎన్నిభుజించినన్ మఱల ♦ నిప్పుడో మూత్రపురీషరూపమై
యన్నియుఁ బోవుచుండుఁగద ♦ యాపనులెల్లను వ్యర్థమేకదా
నిన్ను సదామదిన్ నిలిపి ♦ నిర్మలచిత్తముతోడఁ గొల్చుచున్
సన్నుతిఁజేయు మార్గమె పరి ♦ శస్తతమంబగు జానకీపతీ॥ 32

ఉ॥ ఆశకు మేరలేదు పర ♦ మార్థవిచారణయేని లేదు భూ
మీశులయాపి కానపడ ♦ యిల్లునువాకిలినిన్ ద్యజించియే
దేశమొపట్టిపోయి కడు ♦ దీనుఁడనై యొరునాశ్రయింతు లో
కేశ మదీయ కష్టముల ♦ నేలహరింపవు జానకీపతీ ? ॥ 33

ఉ॥ జీవితకాలమున్ నినుభ ♦ జింపక వ్యర్థముగా నొనర్చితిన్ !
దావకనాము కీర్తన సు ♦ ధన్ గ్రహజేసితివేని దానిచే
ద్రావిభవత్కటాక్షమున ♦ ధన్యుడనయ్యెద నీదుపాదరా
జీవములాశ్రయించితిని ♦ శ్రీరఘునాయక జానకీపతీ ॥ 34

ఉ॥ కంటిని రెప్ప యేగతిని ♦ గాచుచునుండునో యట్లు రామ నా
వెంటనునుండి యెల్లపుడు ♦ వేయి విధంబులఁ గావుమయ్య నీ
కంటెను రక్షకుండిల నొ ♦ కండును లేడని స్పష్టమయ్యె వే
తుంటరి పోకడల్ తొలఁగు ♦ త్రోవలఁ జూపుము జానకీపతీ ॥ 35

ఉ॥ కాయము నింద్రియంబులును ♦ గట్టిగనుండెడు కాలమందె నా
రాయణపాహి పాతకహ ♦ రాయని పల్కఁగ బోధఁ జేసి రా
మాయన మంత్రము న్హృదయ ♦ మందున నాటుచు రామనామపా
రాయణఁ జేయు బుద్ధిని ని ♦ రంతర మియ్యుము జానకీపతీ॥ 36

ఉ॥ నాటకమాడు భంగి భువ ♦ నంబున మర్త్యులు పుట్టి బాల్యమం
దాటలనాడి వ్యర్థముగ ♦ యౌవనమందు రమించి వృద్ధులై
కాటికి గాళ్లు సాచియు న ♦ గాధపు చింతఁ గృశింతురో జగ
న్నాటకసూత్రధారి కరు ♦ ణన్ననుఁ బ్రోవుము జానకీపతీ॥ 37

ఉ॥ నాటకమందుఁ బాత్రలు త ♦ నత్తఱి నొక్కొక పాత్రతోడఁ బో
ర్కాటలనాడుచుఁ యవని ♦ కాంతరభూమికిఁ బోవుకై వడిన్
బోటులు పూరుషుల్ గలసి ♦ భోగపరాయణులై నటించినో
పూటకె నొసర్వము విడిచి ♦ పోయెదరక్కట జానకీపతీ ! ॥ 38

ఉ॥ ఎందును బొందనట్టి బ్రతు ♦ కేల ? వృథాశ్రమనొందనేల ? యో
చందము దోఁచకుండె బహు ♦ జన్మజరామరణాది బాధలన్
బొందుటజాలుఁ గావుమిఁక ♦ పుణ్యజనాథ యదానదీక్ష గో
విందభవబ్బాబ్దము ల ♦ సేదుచునుండెద జానకీపతీ॥ 39

మ॥ ఎత్తితి నెన్నిజన్మములొ ♦ యెన్నిశ్రమల్ పడియుంటినో మహా
పత్తులనెన్ని పొందితినొ ♦ పాడుభవంబున సౌఖ్యమున్నదే ?
యిత్తరినైన నిన్ను భజి ♦ యించి తరింపఁగఁ జేయవే ; భవా
వృత్తివిపత్తునే సనుభ ♦ వింపఁగఁజాలను జానకీపతీ ॥ 40

మ॥ జీవితయాత్రయందుఁ బలు ♦ చిక్కులువచ్చును గాలచక్రమా
యేవిధమేదిసిల్పినను ♦ నెల్లపుడుఁ జరియించుచుండు రా
జీవదళాక్ష సర్వముఁ ద్య ♦ జించి భవత్పదచింతనంబు నీ
సేవనొనర్పనెన్నతిమ ♦ జీవనమిమ్మువె జానకీపతీ ॥ 41

మ॥ ఎంత వయస్సువచ్చినను ♦ నింద్రియనిగ్రహమైన లేదు నా
కెంతయొ భాగ్యముండిన ద ♦ యింపక పోతి ధనాశనైన నా
కింత టినుండి జ్ఞానముద ♦ యించెదుకీర్తి నన్నుగ్రహించి ని
శ్చింతగనీ భవాబ్ధిదరిఁ ♦ జేరఁగఁ జేయుము జానకీపతీ ॥ 42

మ॥ కోట్లకొలంది జీవములు ♦ క్రొత్తగ పుట్టుచున్నగు పంచభూతముల్
చెట్లను జేమలుఁ బవిసి సృ ♦ జింప యముండుహరించుచుండు వా
రిట్లొనరించుచుండమది ♦ కేమియుఁ గొరవ యుంటినయ్యయి
ట్లట్లననేల ? నన్ను శరణ ♦ ణంటిని బ్రోవుము జానకీపతీ ॥ 43

మ॥ మోహమదాదిశత్రువులు ♦ ముట్టడివేయుచు నింద్రియమ్ములన్
గేహాకళత్ర పుత్రులను ♦ కీర్తి ధనాశల పాలుచేసినా
దేహముగుల్లఁజేసినవి త్రిప్పుచున్నవి యేమిసేయుదో !
పాహియటంచు సిదుపద ♦ పద్మముఁ బట్టితి జానకీపతీ ॥ 44

మ॥ చిన్నవయస్సునందిగిరి ♦ పెద్దలమాటలఁ ద్రోసి యెవ్వరే
మన్నను లెక్క సేయక ♦ హోదురితమ్ములఁ జేసి యిప్పుడే
నిన్నన్వరింపఁ బూనితిని ♦ నీకరుణారస వర్షధారలం
దెన్నఁడుస్నానమాడఁ గన ♦ నిచ్ఛెదవో నను జానకీపతీ ॥ 45

ఉ॥ తొమ్మిదిద్వారముల్ చెముట • మూత్రమునుగల్గిన యిట్టివచ్చితోల్
బొమ్మ నలంకరించుకొని • పొంగుచుఁ గాలముఁబాడుచేసి పా
పమ్ములఁజేసితిన్ బళిర • పావనమౌ హరిభక్తి నిప్పుడే
నెమ్మదిలోన నాటితిని • నీవదిపెంపుము జానకీపతీ ॥ 46

ఉ॥ దారసుతాదిబాంధవుల • దగ్గఱఁదీయఁగవచ్చుఁగాని సం
సారము సాగరంబువలె • సాగెడు నయ్యదిదుస్తరంబు త
ద్భారము దుర్భరంబు భవ • బంధములూడక ముక్తిగల్గునే?
గారవముంచి నన్నికను • గట్టునవేయుము జానకీపతీ ॥ 47

ఉ॥ గారడివాని మాయవలెఁ • గన్పడి సర్వమునాశమొందు సం
సార మసారమంచుఁగనఁ • జాలక మోహమునొందియుండుటన్
సారథిలేని గుఱ్ఱముల • చాడ్పున నింద్రియముల్ చరించినన్
ఘోరవిపత్తులొందఁ బడఁ • గూల్చెదుఁ బ్రోవవె జానకీపతీ ॥ 48

ఉ॥ పైకమెట్టులుండునో! వి • పత్తులెవచ్చునో! చావెపుడౌనో
యేక్షణమందునేమొ భవ • దిచ్ఛయెటుండునో గాన నిప్పుడే
యక్షయమౌ త్వదీయ భజ • నామృతమున్ ననుఁ గోర్కెలనిచ్చి పా
పక్షయమౌ విధంబుగఁ గృ • పన్ ననుఁజూడుము జానకీపతీ ॥ 49

ఉ॥ తొమ్మిది పెద్దద్వారముల • త్రోవలుమూయకయుండఁ బ్రాణిదే
హమ్మను పంజరంబును వి • హంగము భంగిఁద్యజించుగానఁ జి
త్తమ్మునఁ దావకీనపద • తామరసంబుల వేగనిల్పి సౌ
ఖ్యమ్మునుబొందఁజేయుము కృ • పాకర శ్రీకరజానకీపతీ ॥ 50

ఉ॥ తానొకటిన్ దలంచు నెడ • దైవమువేఱొదలంచు నంచుఁ దా
మానవులెల్లరున్ బలుకు • మాటలునమ్మితి రామ ప్రేమతో
నేనొనరించు కార్యముల • నెల్లనుఁజక్కఁగ సంస్కరించి యీ
మేను తరింపఁజేగను మ • హేయదయాకర జానకీపతీ ॥ 51

సారవిహీనమౌ పనుల ♦ నల్పుఁగ దూకుచు నింద్రియాళి నిం
పారసుఖంబులన్ దగిలి ♦ సంతసమొందుచునుందు, గాని యీ
ఘోరభవాబ్ధిలో మునిఁగి ♦ కూలెడుసంగతిఁ గానలేదు ; నా
భారము నీదె యింక హరి ♦ భక్తజనాశ్రయ జానకీపతీ ॥ 52

కూటికిఁగుడ్డకానపడి ♦ కొల్వొనరించుచు మానవాళికిన్
నోటిని శుద్ధిచేసెదను ♦ నోహరరామపదంబు నామదిన్
నాటక యిట్టికీర్తి భవ ♦ నాటకమాడుచునుంటి నట్టినా
యాటలమాన్ప నీవు భజ ♦ నామృతమియ్యవె జానకీపతీ ॥ 53

ముష్టికి నష్టిలేదు ఘన ♦ మోదములొందఁగ హద్దులేదు నీ
యిష్టము రామ యెట్టుల మ ♦ హీతలమందు ననుగ్రహింతువో
భ్రష్టునిఁజేయకుండ హరి ♦ భక్తినొసంగి తరింపఁజేయుమా
శిష్టజనావనా కుజన ♦ శిక్షణ సద్గుణ జానకీపతీ ॥ 54

మందమతిన్ వివేకిని స ♦ మానదయన్ గనుచుందు వట్టినీ
పందటివాదముల్ వినుచు ♦ నన్నిమతంబులలో మెలంగుచున్
సుందరమైన నీ జాకృతులఁ ♦ జూపుచు భక్తులు చేయుసత్కృతుల్
పొందవె ? దానునేసలుపు ♦ పూజలఁ గైకొను జానకీపతీ ॥ 55

అక్కఱ వచ్చినన్ బలువు ♦ రాదినముందువఁ బల్కరింతు రా
యక్కఱదీరగానె చను ♦ మందురు పిల్చినఁ బల్కరయ్య ; నే
నిక్కముగా వచించెదను ♦ నిన్నుఁ భజించిన నీవొ భక్తులం
జెక్కవసేరిమతో సతత ♦ మింపొనరింతువు జానకీపతీ ॥ 56

ఎండకువానకోర్చి విష ♦ యేచ్ఛల నెల్లఁ ద్యజించి కానలో
నుండి తపంబుఁ జేయు వగ ♦ యోగులకైనను దుర్గభుండవై
యుండెదు నీవు భక్తులకు ♦ నోసులభుండవు భక్తవత్సలా
ఖండితదైత్య భక్తహిత ♦ కష్టవిమోచన జానకీపతీ ॥ 57

ఉ॥ ప్రాణము పోవువేళ యమ ♦ పాశము లీడ్చుచునుండ శ్లేష్మముల్
ఘ్రాణగళాదిమార్గమది ♦ కట్టఁగ నప్పుడు తోఁప దెద్దియున్
వాణియుఁ బైకిరాదు భగ ♦ వత్స్మృతి గల్గునె? యిప్పుడే శ్రీర
త్రాణమొనర్చు నీ యడుగు ♦ దమ్ములఁ గొల్చెద జానకీపతీ॥ 58

ఉ॥ ఎందఱి నాశ్రయించినను ♦ నెవ్వరుఁ గూడరు వెంటరారు గో
విందపదారవిందసుప ♦ విత్రవరస్మరణామృతంబె మే
మెంచఁ జరింతు మక్కడికి ♦ నేగి జరామరణాది దుఃఖముల్
పొందెదు రీతిఁ బాపి పరి ♦ పూర్ణసుఖంబిడు జానకీపతీ॥ 59

ఉ॥ తల్లియుఁ దండ్రియున్ గురువు ♦ దైవము సర్వము నీవె యంచు నే
నెల్లను రామ! నిన్ గొలుచు ♦ చుండెదఁ గావున నాదు చిత్తమం
దెల్లపుడింపుగాను వసి ♦ యించుచు నన్నుఁ గృతార్థుఁ జేసి నీ
యుల్లమునందు నన్మఱవ ♦ కుండుము నిత్యము జానకీపతీ॥ 60

ఉ॥ కోట్లకొలంది ద్రవ్యమును ♦ గూర్చుచునుండిన నేమిలాభమో!
చెట్లను జేమలందుఁ జలి ♦ చీమలు పుట్టలఁ బెట్టుచుండవే?
యెట్లయినన్ సుకీర్తి యుద ♦ యింపఁగ దానముఁ జేయకున్న నా
కొట్లధనంబు వ్యర్థమది ♦ కూడను వచ్చునె జానకీపతీ॥ 61

ఉ॥ అందఱి కన్నిరూపముల ♦ నన్నిమతంబుల కన్నిపేర్లతో
డెందములందుఁ దోఁచుచు న ♦ టింతువొకండవు కావె? రామ నీ
యందు జగంబులుండుఁ బర ♦ మాత్మవు మూలవిరాట్టువయ్య నీ
చందము యోగులైనఁ గనఁ ♦ జాలరు ప్రోవవె జానకీపతీ॥ 62

ఉ॥ చండకృశానుభాను ఘన ♦ చంద్రకళాధికపూర్ణతేజ కో
దండకరా భయార్తిహర ♦ దండధరాదిసురాధినాథ బ్ర
హ్మాండధురంధరుండవు చ ♦ రాచరమంతయు నిండియున్న నీ
యండను జేరినాఁడ నభ ♦ యంబిడి ప్రోవవె జానకీపతీ॥ 63

ఉ॥ ఒక్కఁడునవ్వుచుండ మఱి ♦ యొక్కఁడు ధారుణినేడ్చుచుండు వే
రొక్కఁడుపుట్టుచుండమఱి ♦ యొక్కఁడుచచ్చుచునుండు నెవ్వఁడీ
వొక్కని నెక్కచందమున ♦ నుంచవు నీకది చిద్విలాసమే ?
చిక్కులు పెట్టకయ్య కృపఁ ♦ జేసెదు స్వామివి జానకీపతీ ॥ 64

ఉ॥ నీవు సమస్తలోకముల ♦ నిల్వఁగబెట్ట దశావతారివై
స్థావరజంగమంబులను ♦ సర్వముఁ గాచుచునుందువయ్య నీ
పావనసచ్చరిత్రములు ♦ పన్నగనాయకుఁడెన్నఁ జాలునే ?
దేవపరాత్పరా వరద ♦ దివ్యకళాలయ జానకీపతీ ॥ 65

ఉ॥ ఆవిధి నిద్రపోవ సక ♦ లాగమముల్ హరియించి సోమకుం
డావనధిఁ జరించి జల ♦ మందునడాఁగఁగ మత్స్యమూర్తివై
నీవపుడేగినీటను ము ♦ నింగి దురాత్ముని వానిఁ జంపి వే
దావళిఁ దెచ్చియిచ్చితివి ♦ యట్టిఘనుండవు జానకీపతీ ॥ 66

ఉ॥ వాసుకిత్రాడు మందరము ♦ వాసిగఁ గవ్వముగా సమర్చి దే
వాసురులబ్ధిఁజిల్కుతఱి ♦ నందు నగంబు మునుంగుచుండ మం
థాసనమాచుఁ గూర్మముగ ♦ నై యమృతంబుదయించుసట్లుగాఁ
జేసిన పుణ్యమూర్తివి ప్ర ♦ సిద్ధయశుండవు జానకీపతీ ॥ 67

ఉ॥ ఈక్షితిమండలంబు చలి ♦ యించి జలంబుల మున్గిపోవఁ ద
ద్రక్షణమాచరింపఁగ వ ♦ రాహమవై చని నీమునుట్టెపై
నా క్షితినెత్తి బంతివలె ♦ నచ్చటనే నిలఁబెట్టి యా హిర
ణ్యాక్షునిఁ జంపిభూతలము ♦ నాపినవాఁడవు జానకీపతీ ॥ 68

ఉ॥ ఆ దనుజేంద్రుఁడౌ జనకు ♦ నైనఁ ద్యజించి విరాగియౌచు నీ
పాదసరోజముల్ పరమ ♦ భక్తిని నమ్మి భజించుచుండు ప్ర
హ్లాదునిఁ బ్రోవ స్తంభమున ♦ నప్పుడె శ్రీ నరసింహమూర్తివై
యాదితి పుత్త్రుఁ జంపితివిఁ ♦ యద్భుతమూర్తివి జానకీపతీ ॥ 69

ఉ॥ వామనమూర్తివై మధుర ♦ వాక్యములన్ బలిచక్రవర్తితో
"నో మహనీయ మూఁడడుగు ♦ లీను స్థలంబిమ్ము" మంచు నల్లపూ
ర్వామరుఁడిచ్చువాని శిర ♦ మందుఁ బదంబిడి విక్రమించి యా
బాముల నెల్లఁ బాపితివి ♦ భద్రనగాలయ జానకీపతీ॥ 70

ఉ॥ రాజులఁ జంపఁగాఁ బరశు ♦ రాముఁడవై పితృశాసనంబుచేఁ
దేజము దర్పముల్ మెఱయఁ ♦ దీవ్రకుఠారనిశాతధారతో
నీజగమందు రాజకుల ♦ హింసఁ బొనర్చియు నిర్వదొక్కమా
ఱీజగతిన్ మహీసురుల ♦ కిచ్చిన దాతవు జానకీపతీ॥ 71

ఉ॥ కోమలమేఘగాత్ర వర ♦ కూర్మసుపృష్ఠపదాగ్ర శోభిస
త్తామరసోదరాంఘ్రితల ♦ తామ్రజపాకుసుమస్ఫురన్నఖా
కామమనోజ్ఞకాహళని ♦ కాశమనోహరజంఘ శేవ శ్రీ
రామ భవత్కృపాంబునిత ♦ రంగము జూపవె జానకీపతీ॥ 72

ఉ॥ చారుగజేంద్రహస్త విల ♦ సన్మృదులోరుయుగా మృగేంద్రమ
ధ్యా రమణీయకాంతి నిచ ♦ యాంచితసాంద్రవిశాలవక్ష రే
ఖారచనాఢ్యకంబునిభ ♦ కంఠ మహార్గళదీర్ఘబాహు ర
మ్యా రఘువంశపావన ద ♦ యన్ గనుచుండుము జానకీపతీ॥ 73

ఉ॥ బాలపలాశరమ్య మృదు ♦ పాణితలా స్ఫురదున్నతాంస జ్యో
త్స్నాలలితస్మితా విమల ♦ దాడిమబీజసమానదంత స
త్యాలయ మంజుభాష మధు ♦ రాధరపల్లవ సత్స్వభావ లీ
లాలసదంబుజాక్ష శుభ ♦ లక్షణ ప్రోవుము జానకీపతీ॥ 74

ఉ॥ ఆయతచారుకోమలఘ ♦ నావళినీలశిరోజ కార్ముక
భ్రూయుగళా మనోజ్ఞతిల ♦ పుష్పసమున్నతనాసికా శ్రుతి
శ్రీయుత సత్కపోలలిత ♦ శీతలచంద్రమనోహరాననా
నా యెడ నీకృపాలత పెం ♦ పంగొనఁ జేయుము జానకీపతీ॥ 75

ఉ॥ హేమకిరీటకోటిమణి ♦ హీరవిలాసితసన్ముఖాళకా
స్తోమసువర్ణకుండల సు ♦ శోభితకర్ణయుగా వరాంగదా
స్తోమ విచిత్రరత్నకలి ♦ తామల మౌక్తికహార రమ్య శ్రీ
రామ మనోజ్ఞవేష వడి ♦ రక్షింటు చూచెద జానకీపతీ॥ 76

ఉ॥ కాంచన పద్మరాగమణి ♦ కంకణభూషితపాణిపల్లవా
చంచలరత్నకాంతి విల ♦ సద్రశనాంచితసూక్ష్మమధ్య రే
ఖాంచల పీతవస్త్ర వివి ♦ ధాభరణార్చితపాదపద్మర
త్నాంచిత భూషణాఢ్య లలి ♦ తాంగుని బ్రోవుము జానకీపతీ॥ 77

ఉ॥ శ్రీవిలసత్పవిత్రతుల ♦ సీదళచందన పుష్పభూషితా
పావనసద్గుణాభరణ ♦ భక్తివినమ్ర సమస్త భక్తసం
సేవితసుందరాంఘ్రిసర ♦ సీరుహ భక్తజనావన ప్రియా
కావుము రామ భక్తజన ♦ కామిత దాయక జానకీపతీ॥ 78

ఉ॥ వేదసమస్తశాస్త్రచయ ♦ వేద్యమహాగుణ షోడశోపచా
రాదిసమర్చితా సుహృద ♦ యా సుకవీశ్వరసంస్తుతిప్రియా
స్వాదుఫలాన్నభోగ ఘన ♦ వైభవ దాససుహృష్టమానసా
నీదు కృపాకటాక్షముల ♦ నిల్పుముమాయెడ జానకీపతీ॥ 79

ఉ॥ తుంబురు నారదాదులు శ్రు ♦ తుల్ సరిగా భరతప్రవీణతన్
దంబుర మీటుచుండియు సు ♦ ధారసమొప్పఁగఁ బాడుచుండి నృ
త్యంబునొనర్చిసొక్కి దర ♦ హాసముఖుల్ నినుఁ జేయుచుండు కా
లంబుననుండు నీముఖవి ♦ లాసముఁ జూపవె జానకీపతీ॥ 80

ఉ॥ ముద్దులుమూటగట్టు నగు ♦ మోమునఁ దళ్కులుకుల్కుచుండఁగా
నొద్దికసొంపునింపు మధు ♦ రోక్తులు తేనెలఁ జిమ్ముచుండ మే
లద్దము బోలుచెక్కులుల ♦ హాసకళాంగన నాట్యమాడ నీ
ముద్దుమొగంబుఁ జూపుచుఁబ్ర♦మోదమొసంగుము జానకీపతీ॥ 81

ఉ॥ దాశరథీ సుబాహుముఖ ♦ దైత్యహరా మునియజ్ఞరక్షకా
కౌశికదత్త దిగ్విజయ ♦ కారణదివ్యమహాస్త్రజాల గౌ
రీశధనుర్విభంజన మ ♦ హీశనయాహ్వాదయాబ్జభృంగ స
ర్వేశ చిదాత్మరామ పర ♦ మేశ్వర కావుము జానకీపతీ॥ 82

ఉ॥ భానుకులాబ్ధిసోమ సిత ♦ భార్గవరామ మహాపరాక్రమా
మానవిభూషణా సుగుణ ♦ మండిత పౌరజనాభివందితా
యానకులాభిమాన సుమ ♦ హానరవాస్త్రాల రామచంద్ర యీ
నేనొనరించు సత్కృతిని ♦ నేడు గ్రహింపుము జానకీపతీ॥ 83

ఉ॥ వారితసర్వరాజ్య పితృ ♦ వాక్పరిపాలనసద్వ్రతైక నీ
తారత వీతరాగ విభు ♦ సన్మునివేష వినీతభావ సీ
తాగచిత్తోపచార కృతి ♦ దక్షగుణాలక్ష్మణసంయుతా జగ
త్కారణ రామభక్తహిత ♦ కావు మహేంద్రియ జానకీపతీ॥ 84

ఉ॥ దీనదయాపరా మహిత ♦ దివ్యకళాపసన్ముఖాంబుజా
మానవవేష శాంతగుణ ♦ మండన త్య్రక్షసమస్తవైభవా
మానసరాజహంస వర ♦ మానసదృప్తప్రచండదండకా
కాననవాస దైత్యగణ ♦ ఖండన కావుము జానకీపతీ॥ 85

ఉ॥ వానరరాజమిత్ర ఘన ♦ వారినిబంధన పండితా మరు
త్సూనుభుజోపవిష్ట వర ♦ తూణశరాసన ముష్టిభూషితా
దానవవంశతూల ఘన ♦ దావసముజ్జ్వలదగ్నిహోత్రి కో
పానలదగ్ధదైత్య కరు ♦ ణామృత సీతగా జానకీపతీ॥ 86

ఉ॥ రావణకుంభకర్ణులను ♦ రక్కసులన్ వధియించి జానకీ
దేవినిగూడి వేడ్క జల ♦ ధిన్ వడిదాటి సుఖంబుగా నయో
ధ్యావరరాజధానిని ప్ర ♦ భాసముమందు వెలుంగునట్టి యో
గ్యావన భక్తరక్షణప ♦ రాయణ ప్రోవుము జానకీపతీ॥ 87

ఉ॥ దుష్టులు దానవాంశజులు ♦ దోర్బల గర్వమునొందిభూమిపై
నిష్టమువచ్చినట్లు చరి ♦ యించి మహాత్ములఁ బాధపెట్టుచుం
గష్టము గల్గఁజేయఁగని ♦ గ్రక్కున శ్రీబలరామమూర్తివై
ముష్టికు నాదురాత్ములను ♦ మొత్తితివచ్యుత జానకీపతీ॥ 94

ఉ॥ గోకులమందుఁ బుట్టియుల ♦ గొల్లల యిండ్లను వెన్నదొంగవై
పోకిరి పాటపాటలను ♦ బాగుగఁ జూపుచు గొల్లవారిపై
శ్రీకరమౌ కృపారసముఁ ♦ జిమ్మిన కృష్ణుఁడ నీవకాదె? రా
మాకృపజూచు దివ్యమహి ♦ మా నన్నుఁ బ్రోవుము జానకీపతీ॥ 95

ఉ॥ మున్ను కుబ్జ గంధమిడి ♦ మోదముతో నినువేడగానె యా
విన్నపమాలకించి కను ♦ వేడుక దానిని సుందరాంగియౌ
కన్నను జేసి కామముగ ♦ కామిత మిచ్చియుఁ బ్రోచినట్టియా
వెన్నుఁడ నీవకాదె? నిను ♦ వేఁడితి ప్రోవుము జానకీపతీ॥ 96

ఉ॥ ద్రౌపది మానభంగమున ♦ దప్పఁ బరాత్పరయంచు వేఁడఁగా
నీ వను గాఁ గొని ♦ నీవు కోకలిచ్చి యామె నా
మానము కాచితివి ♦ యాకరుణానిధి నీవుకాదె? నా
పాపము దేమొకాని చెవిఁ ♦ బట్టవు నా మొఱ జానకీపతీ॥ 97

ఉ॥ కొంచెముగూర్చి గుప్పెడటు ♦ కుల్ నిరుపేదకుచేలుఁడియ్య భ
క్తించి సమస్తమిచ్చికృప ♦ చేసినకృష్ణుఁడవీవుకాదె? నీ
వించుకయైన నాస్థితి గ ♦ హింపవు పిల్చినబల్కవే? కటా
క్షించుటకై దినేశకుల ♦ శేఖర వేఁడెద జానకీపతీ॥ 98

ఉ॥ క్రూరులు దానవాంశజులు ♦ కుంభిని యందుదయించి వైదికా
చారగరిష్ఠులై పరులు ♦ చంపనశక్యులునై చరింపఁగా
వారికి నాస్తికప్రబల ♦ వాదమునేరిపి బౌద్ధమూర్తివై
పేరుపుగావనించితివి ♦ నీసముఁడెవ్వఁడు జానకీపతీ॥ 99

ఉ॥ భూతలమందు గల్కియయి ♦ పుట్టి తురంగము నెక్కి ఖడ్గము
జేత ధరించి దుష్టులు న ♦ శింప వధించి సమస్త ధర్మని
ర్ణేతవు నౌచు శాంతిని ధ ♦ రిత్రిని నిల్పెదవవ్యయా పరం
జ్యోతి వసంతరూపుడవ ♦ ఖండవు ప్రోవవె జానకీపతీ ॥ 100

ఉ॥ శ్రీయుత శంఖచక్రతుల ♦ సీదళదామ విరాజితాంగ నా
రాయణ రామ కృష్ణ వర ♦ మాన్య నిజాశ్రిత పారిజాత రా
మాయణ వర్ణనీయ మహి ♦ మా పరిపూర్ణకటాక్ష శ్రీజగ
న్నాయక శ్రీనివాస కరు ♦ ణానిధి ప్రోవవె జానకీపతీ ॥ 101

ఉ॥ మాధవ కేశవా దనుజ ♦ మర్దన పద్మదళాక్ష వామనా
శ్రీధర వాసుదేవ నర ♦ సింహ ముకుంద హరీ జనార్దనా
సాధుజనావనా నిగమ ♦ సన్నుత పంకజనాభ విష్ణు లో
కాధిప రామచంద్ర పురు ♦ షార్థఫలప్రద జానకీపతీ॥ 102

ఉ॥ తొల్లి గజేంద్రుడా మొసలి ♦ తోడను బోరగ లేక దీనుడై
తల్లటమొంది పాహియని ♦ ధ్యానముఁ జేయఁగ వేగఁ బోయి నీ
వల్లరిపుం వధించి యపు ♦ డా గజరాజును గాచినాడవే?
సల్లలితావతార ననుఁ ♦ జల్లఁగఁ జూడుము జానకీపతీ ॥ 103

ఉ॥ రామ గుణాభిరామ రఘు ♦ రామ మనోహరనామ దేవ శ్రీ
రామ జగత్త్రయావన ధు ♦ రంధర స్వాశ్రిత కల్పవృక్ష నీ
నామము లెల్లపల్కిన మ ♦ నస్సు సుఖించును రామచంద్ర నీ
నామము మోక్షదాయకము ♦ నాకుఁ బ్రియంబది జానకీపతీ ॥ 104

ఉ॥ దాసుని తప్పులన్నియును ♦ దండముతో సరియన్నరీతి నా
దోసములెల్ల నీ భజన ♦ తో సరి రాఘవరామ నేను నీ
దాసుడనయ్య సర్వ మభవ ♦ ధర్మముగాదిక ప్రేమయుంచి నీ
భాసురసత్కటాక్షములఁ ♦ బంపుము నాపయి జానకీపతీ ॥ 105

ఉ॥ శ్రీచరణారవిందముల ♦ నిత్యము గొల్చెడు భాగ్యమిమ్ము సీ
తాచకితాక్షి కైరవసు ♦ ధాకర పాలితలోక భక్తర
క్షాచరణైకచిత్త పవ ♦ నాత్మజసేవితపాదపద్మ భ
ద్రాచలధామ నాయక ♦ టాత్మమునుంచుము జానకీపతీ॥ 106

ఉ॥ రామపదంబు మంగళక ♦ రంబది సర్వసుఖప్రదంబు శ్రీ
రామనుబీజముల్ దురిత ♦ రాశిహరంబులు రాఘవేంద్ర నీ
నామము సంస్మరించెను జ ♦ నంబుల కాపదలుండునే? పరం
ధామ భవత్ప్రసాదమున ♦ ధన్యుడనైతిని జానకీపతీ॥ 107

ఉ॥ సూర్యకులోత్తమా భువన ♦ సుందరవిగ్రహ శౌర్యధైర్య గాం
భీర్యదయావతంస రణ ♦ భీకర చండపరాక్రమాఢ్య సత్
కార్యధురంధరా సకల ♦ కామితదాయక రామ! అయ్యమా
చార్యసమర్చితాంఘ్రిజల ♦ జద్వయ ప్రోవుము జానకీపతీ॥ 108

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.





